ఓం

శ్రీమతే రామానుజాయ నమః

# మంత్రవైభవము

# నారాయణ అష్టాక్షరీ మంత్ర మాహాత్మ్యము

**శ్రీ త్రిదండి జీయర్‌స్వామి ప్రోత్సాహేన**

తె. కం. గోపాలాచార్యేణ ప్రకాశితం

**శ్రీమదుభయ వేదాన్తాచార్య పీఠం**

293, 294 సతారావీధి – శ్రీరంగం – తిరుచ్చిజిల్లా తమిళనాడు

పెరియజీయర్ మఠం, లేక చిన్నజీయర్ మఠం – తిరుపతి—తిరుమల

చిత్తూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్

---

**శ్లో॥ ద్వే బ్రహ్మణీ వేదితవ్యే శబ్దబ్రహ్మ పరం చ తత్ ।**
**శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరబ్రహ్మాధిగచ్ఛతి ॥**

బ్రహ్మకు రెండురూపములు : ఒకటి శబ్దబ్రహ్మము. రెండవది పరబ్రహ్మము. శబ్దబ్రహ్మ యందలి నిష్ఠయే పరబ్రహ్మను పొందుటకు సాధనము. అట్టి శబ్దబ్రహ్మయే మంత్రమనబడును.

## మంత్రసిద్ధి సాధనము

కోరికను సఫలపరచగల ప్రాకృత-అప్రాకృత శక్తులనే దేవతలు అని వ్యవహరించు చుందుము.

ప్రతి మంత్రమునకును మంత్రాధిష్ఠాన దేవతయు. తద్బీజాక్షరాధిష్ఠాన దేవతలు ఉందురు. వారికి సంబంధించిన బీజాక్షరములు సంపుటీకరణము - సమ్మేళనములద్వారా (మంత్రజపముద్వారా) మన ఆత్మశక్తిని పురశ్చరణము (నిర్ణీత జప తర్పణ - హోమ - పుష్పాంజలి - బ్రాహ్మణ భోజనములను శాంతి) ద్వారా ఆయా దేవతలను మన కనుకూలించునటుల, మనల ననుగ్రహించునటుల, మన యభీష్టముల నెరవేర్చునటుల జేసికొనుటనే మంత్రసిద్ధి యందురు.

లౌకికములైన శబ్దములకుకూడ ఫలసిద్ధికలుగుటలో భేదమునకు అక్షరములయొక్కయు, శబ్దములయొక్కయు సంపుటీ కారణమేకదా కారణము. 52 అక్షరములు అందరికిని సమానమేకాని వానిని ఒక రకముగా సంపుటీకరణము చేసినచో మంచి ఫలము కలుగును. మరొకరకముగ సంపుటీకరణము

చేసినచో ఆ అక్షరములే విరుద్ధఫలమును కలిగించును. ఉదాహరణకు 'సాక్షరాః' అనినచో విద్వాంసుల కర్థమగును. దానినే తల్లక్రిందులుగ 'రాక్షసాః' అనినచో విరుద్ధమైన దుర్మార్గుల కర్థమగునుకదా.

కొంతమందికి కొన్ని కొన్ని మంత్రములు (క్షుద్రదేవతలకు సంబంధించిన క్షుద్రమంత్రములు) ఎంత జపము చేసినను సిద్ధించవు. సరిగదా కొంతమందికి ప్రత్యుత విపరీతమై బెడిసికొట్టును. అనగా విపరీతమైన - ఆపత్కారమైన విధముగా ఫలించును. అందుచే మంత్రోపాసకుడు మొదటనే అర్వణ చక్రముద్వారా తనకే మంత్రము విరుద్ధమైనదో, ఏ మంత్రము అనుకూలమైనదో ఫలించునో లేదో తెలిసికొనవలసియున్నది. ఆ మంత్రాధిష్ఠానదేవతా శక్తులకును, తన యాత్మాత్మిక శక్తులకును, పరస్పర సంబంధము జన్మాంతరమైనట్టిదియో, ఈ జన్మమున కలిగినట్టిదియో, లేక ఉపదేశకుల ప్రభావమువలన కలలో కలిగినట్టిదియో యున్ననేగాని మంత్రసిద్ధికలుగదు.

కాని మహామంత్రములకు ఈ నియమము అక్కరలేదు. అనగా అర్వణ సంబంధము లేకుండగనే అందరికి అనుకూలించి ఫలించగల్గునుకాని వాటికినికూడ కొన్ని ప్రధాన నియమములను అవలంబించవలసి యున్నది.

1. శ్లో॥ మంత్రే తద్దేవతాయాం చ, తథా మంత్రప్రదే గురౌ ।
త్రిషు భక్తి స్సదా కార్యా, సాహి ప్రథమసాధనం ॥

మంత్రమునందును శ్రద్ధా భక్తి విశ్వాసము లుండవలెను. మంత్రాధిష్ఠానదేవతయందును శ్రద్ధా భక్తి, విశ్వాసములుండవలెను. మంత్రోపదేశకులైన గురువునందును శ్రద్ధా భక్తి విశ్వాసములుండవలెను. ఈ శ్రదా భక్తి, విశ్వాస రూపమైన ప్రేమ ఎవరికి, వేనియందు ఎంతగ ఏ విధముగ ఎపుడు ఎచ్చట యుండునో వారలకు అంతగ ఆ విధముగ ఆయా కాలములందు ఆయా ప్రదేశములందు ఆయామంత్రములు ఫలించును, సిద్ధికలుగును. ఇది మంత్రసిద్ధికి ప్రథమసాధనము.

2. దేశకాల పరిస్థితులు ప్రతి విషయమునకు కారణములు: కనుక ఏఏ మంత్రసిద్ధికి ఏఏ దేశములు అనుకూలములో అచ్చటనే వాటిని ఉపదేశము పొందుట జపించుట చేయవలెను. ఉదాహరణకు - విష్ణుదేవతాకమైన మంత్రములను ఇంటిలో జపము చేయుటకంటెను, గోశాలలో జపముచేసినచో పదిరెట్లు హెచ్చు ఫలితము కలుగును. గోశాలకంటెను వనము; వనము కంటెను జీవనది యొడ్డు - దానికంటెను సముద్రతీరము - దానికంటెను మర్రిచెట్టుక్రింద కాని - అశ్వత్థవృక్షము క్రిందగాని. దానికంటెను విష్ణ్వాలయము - దానికంటెను విష్ణుదేవతాకమైన పర్వతశిఖరము.

ఇటుల ఒకదానికంటె మరొకటి పదేసిరెట్లు అధికఫలము నీయగలవు.

అటులనే కాలనియమములు: చైత్రమాసము, శ్రావణమాసము, మార్గశీర్షమాసములున్ను, ఏకాదశి, పౌర్ణమి మున్నగు తిథులున్ను, అశ్విని, స్వాతి, విశాఖ, జ్యేష్ఠ, మూల, శ్రవణం, ఉత్తర, రేవతి ఇత్యాది నక్షత్రములున్ను ఉషఃకాలము, మధ్యాహ్నకాలము మున్నగు వేళలున్ను యోగ్యమైనవి. అటులనే జపమును చేయుటకు ఒక మండలకాలమని చేయుటయు, జపముచేయు మంత్రములో ఎన్ని అక్షరము లున్నవో అన్నిలక్షల పర్యాయములు జపముచేయుటయు ప్రశస్తము. గావున అందులకనుకూలముగ కాల పరిమితిని ఏర్పరచుకొనవలయుననియు నియమమున్నది.

ఈ నియమము కృతయుగమునాటిది. కలియుగమున ఆధ్యాత్మిక వాతావరణ సంకుచితమై యుండును, గావున ఒకటికి నాలుగురెట్లు అనగా మంత్రములోని ఒక్కొక్క అక్షరమునకు నాలుగేసిలక్షల పర్యాయములు చొప్పున జపము చేయవలసియుండును.

అటులా ఉపాసకుడు జపప్రారంభమున అంతఃశుద్ధి, బాహ్యశుద్ధి గలవాడుగ నుండవలెను. బాహ్యశుద్ధికై చాంద్రాయణ మాచరించవలెను. తరువాత స్వాచార్య శ్రీపాదతీర్థమును తీసుకొనవలెను. పంచగవ్యప్రాశన మొనర్చవలెను. బ్రహ్మకూర్చతీర్థమును స్వీకరించవలెను.

పిమ్మట శోషణ- దాహన- స్నానములను- ప్రాణాయామాదుల గలవాడు కావలెను.

ఆసననియమములు— పరిశుద్ధమైన, ఏకాంతమైన, నిర్భయమైన శత్రు, మృగ, క్రిమికీటాదుల వలన బాధలేని నిర్విఘ్నకరమైన భాగవతోత్తముల నివాసముచేతనో అభిమానముచేతనో పవిత్రమైన, దర్భలు, తులసి మున్నగువాని ఉద్భవముచే పవిత్రమైన కృష్ణమృగసంచారముచేత పవిత్రమైన ప్రదేశమున గోమయ లేపనముచే పవిత్రమైన ప్రదేశము కావలెను. అందు సమతల ప్రదేశమై యుండవలెను. అందు కొద్దిఎత్తు పీఠముపై దర్భాసనము, దానిపై కృష్ణాజినము, దానిపై తెల్లని వస్త్రముపరచుకొని కూర్చొనవలెను. అందు తూర్పుముఖముగ కూర్చుండుట శ్రేష్టము. ఉత్తరము మధ్యమము, పడమర అధమము, దక్షిణ దిక్కు సర్వదా త్యాజ్యము.

స్వస్తిక్ ఆసనము లేక సుఖాసనము లేక పద్మాసనమునగాని కూర్చొని జపమాచరించవలెను. జపసాధనకాలమున నిత్యము త్రిషవణస్నానము. కేవల సాత్వికమైన ఆహారమును నియమముగ తీసు కొనుట, బ్రహ్మచర్యము మట్టినేలమీద పరుండుట ఇత్యాది నియములతో నుండవలెను. పగటినిద్ర, తైలా భ్యంగము కూడదు. కామ, క్రోధ, లోభ, మోహ మద మాత్సర్యములు ఇత్యాదులు లేకుండగ యుండ వలెను. అన్నిటికంటెను ఆహారనియమము అతి ప్రధానము, నిషిద్ధాహారము లెంతమాత్రము స్వీకరించ రాదు. ఏకభుక్తముండవలయును. నీరో, పాలో, పండ్లో, ఉప్పు, కారము, పులుపులేని హవిస్సో యిటుల తమ ఆరోగ్య అవకాశము ననుసరించి తీసుకొను చుండవలెను.

మంత్రములను ఆధ్యాత్మిక శక్తిసంపన్నులైన యోగ్యులైన- ప్రియులు- హితులు అయిన గురువు వలన సక్రమమైన రీతిని ఉపదేశము పొందవలెను. గురువునకు ఎదురుగ తాను ఉండగా వారు శిష్యుని శిరస్సును తాకుచుగాని లేక గురువుగారి రెండుకాళ్ళను శిష్యుడు పట్టుకొనియుండగ గాని, శిష్యుని కుడిచెవులో వినిపించునటులగాని, గురువు దర్భద్వారా శిష్యుని స్పృశించుచుగాని, గురువు శిష్యుని తనఎదుట కూర్చొనబెట్టుకొని తన చల్లని దృష్టితో జూచుచుగాని శిష్యుడు ఎదుట లేకపోయినప్పటికిని గురువు ఆ శిష్యుని తలంచుకొని అతనికీమంత్రము సిద్ధించవలెను అని అంతరాత్మను ప్రార్థించుచుగాని గురువు తన ఆధ్యాత్మిక శక్తిని శిష్యునికి అనుగ్రహించుట ఉపదేశమనబడును.

అటులగాకుండగ గురువునకు తెలియకుండగనే ఆయన యితరులకు ఉపదేశించుచుండగ తాను చాటుగనుండి వినిగాని, లేక గురువునకు, తెలియకుండగ ఏవో యితర మార్గములద్వారాగాని లేక గురు వును మోసగించిగాని, గురుశుశ్రూష-తగిన సద్భావన సమర్పణము-తగిన విద్యాది ప్రతిఫల ప్రదానములు లేకుండగగాని కాగితముమీద వ్రాసియున్న దానిని తనంతట తానే సొంతముగ చదువుకొనిగాని యిటుల

సంపాదించిన మంత్రములు ఫలించవు. ఉపదేశమనగా ఆస్తికుడైన ఆచార్యుడు, తనఅంతరాత్మ స్వరూపుని ప్రేరణచే, యోగ్యుడగు శిష్యునియందు దయావాత్సల్యములు కలవాడై శిష్యుని ప్రియ హితములు కోరుచు శిష్యునికి తనను తనగురువునకు ఉపకరణముగా భావించుచు, తనశిష్యుని తనకు సబ్రహ్మచారిగ భావించుచు, పరబ్రహ్మాత్మకమైన మంత్రమును శబ్దబ్రహ్మమైన ధ్వనులతో తన ఆత్మశక్తిని శిష్యునకు అనుగ్రహించుట మాత్రమే ఉపదేశమగును.

గురువు తన ఉపదేశమునకు ప్రతిఫలమును ధనరూపముగనో, సేవారూపముగనో శిష్యునినుండి కోరినచో దరిద్రుడనబడును. శిష్యుడు గురువును తగిన విధముగ తాను ధన, మనములతో ఆదరించనిచో దొంగయగును. గురువుయొక్క శరీరపోషణభారము శిష్యునిది. శిష్యుని ఆత్మపోషణ భారము గురువుది. గురువు తన శరీరపోషణము, తనబంధువర్గ పోషణము ఎటులజరుగునో యని విచారించ రాదు. ఏలననగా గురువుయొక్క శరీరపోషణ బాధ్యత శిష్యుడిదే.

శిష్యుడు తన ఆత్మోజ్జీవనము గురించి చింతించరాదు. ఏలననగా గురువునకు, తనయాత్మను సమర్పించినాడు. గాన తదుజ్జీవన బాధ్యత గురువుదే కదా!

ప్రతిమంత్రజపమునకు సంఖ్యానియతియుండును. సంఖ్యలెక్కపెట్టకుండగ జపమాచరించరాదు. అందులకు తులసిమాలిక పద్మపూసలమాలిక స్ఫటికమాలిక పగడముమాల లేక స్వర్ణరజితాది మాలికయో చివరకు దర్భలకు మణిపూసలవలె ముడులువేసియో ఉపయోగించవలెను.

మాలికయొక్క పూసలను ముందు ప్రతిష్ఠజేసి పిమ్మట మాత్రమే ఆమాలికల నుపయోగించ వలెను. బజారులోకొన్న మాలికలను నూనె, గోమయము పసుపులలో చాలకాలముంచి అందుండి తీసిన తర్వాత మంచినీళ్ళలో కడిగి పిమ్మట ప్రతిష్ఠచేసి పిమ్మట ఉపయోగించవలెను. జపము చేసుకొను మాలికను మెడలో వేసుకొనరాదు. దానికై ప్రత్యేకముగ వేరే మాలికను ఉపయోగించుకొనవలెను. ధరించిన మాలికతో జపము చేయరాదు. మాలికకుగల మేరుపూసను దాటకుండగ లెక్కపెట్టవలెను. మాలికతో ఒక ఆవృత్తిఅయిన తర్వాత తిరిగి మాలికను వెనుకకు త్రిప్పిమాత్రమే జపము చేయవలెను. లెక్కపెట్టునపుడు తర్జనవేలు నుపయోగించరాదు. జపమును పైకి అందరికిని వినిపించునటుల గట్టిగా రాచనికముగ చేసినదానికంటె, పెదిమలు కలుపుచు తనకు మాత్రము వినిపించునటుల జపము చేయుట యును ఉపాంశువుగ జేయుట శ్రేష్ఠము. ఈవిధానముకంటెను మానసికముగ జపమాచరించుట సర్వోత్తమము.

జపము చేయునపుడు మంత్రోచ్చారణము అతి నెమ్మదిగగాని లేక అతి తొందరగగాని కూడదు.

మంత్రార్థమును తెలుసుకొనకుండగ జపమాచరించరాదు. అర్థమును భావనచేయుచు మంత్రమును జప మాచరించవలెను. కండ్లు మూసుకొని మంత్రాధిష్ఠాన దేవతను ప్రత్యక్షదర్శనగ చాలకాలముగ మనస్సున భావించుచూ, షోడశోపచారములతో ఆరాధన మొనరించుచు జప మాచరించవలెను. జపమధ్య మున దిక్కులచూచుటగాని, మాట్లాడుటగాని నిద్రించుటగాని కూడదు.

జప ప్రారంభదినముననే చక్రాబ్జమండలమున కుంభస్థాపనముచేసి తత్పూజానంతరమున అగ్ని ప్రతిష్ఠాపనచేసి తదారాధనపూర్వకముగ జపమాచరించవలెను. జపానంతరమున మంత్రము సిద్ధించును.

దానికనుగుణమైన సూచనలు బాహ్యముగనో కలలోనో కలుగును. ఒక్కొక్కప్పుడు దుశ్శకునములు, దుష్టకలలు కలుగును. అట్టి సమయములలో శాంతిహోమమును చేయించవలెను.

మంత్రసిద్ధిని గురువునకు తప్ప మరెవరికిని తెలుపరాదు. తన యనుష్ఠానమును అనుభవమును వెల్లడించరాదు. నిరీత జపానంతరమున తద్దశాంశము హోమము, తద్దశాంశము క్షీరతర్పణము, తద్దశాంశము పుష్పాంజలి, తద్దశాంశము బ్రాహ్మణభోజనము ఇత్యాదుల జరుపవలెను. గురువునకు తగిన దక్షిణనిచ్చి సంతోషపెట్టవలెను. మంత్రసిద్ధిని స్వార్థమున కెంతమాత్రము ఉపయోగించుకొనరాదు. పరోపకారమునకై లోకకల్యాణార్థమై మాత్రమే ఉపయోగించవలెను. మంత్రసిద్ధిని పొందుటచే తానెంతమాత్రము గర్వించరాదు. అహంకరించరాదు.

మంత్రజపసిద్ధికై సాధారణముగ ఈ క్రింది విధములైన న్యాసాదులు అంగములు గలవు.

1. భూశుద్ధి
2. భూతశుద్ధి
3. శోషణ- దాహన- పావనములు
4. పంచోపనిషన్న్యాసం
5. బ్రహ్మన్యాసం
6. సుదర్శనన్యాసం
7. వైష్ణవన్యాసం
8. అంగుళీన్యాసం
9. బీజషడంగన్యాసం
10. మంత్రషడంగన్యాసం
11. సృష్టిన్యాసం
12. స్థితిన్యాసం
13. లయన్యాసం (సంహారన్యాసం)
14. అంగన్యాసం
15. కరన్యాసం
16. ఏకాక్షరన్యాసం
17. అంతర్మాతృకాన్యాసం
18. బహిర్మాతృకాన్యాసం
19. అచోస్త్రన్యాసం
20. అక్షరన్యాసం
21. సర్వాంగన్యాసం
22. ఆత్మసూక్తం
23. సాత్త్వికత్యాగం
24. నామపంజరం
25. సాత్త్వికత్యాగం
26. దిగ్బంధనం
27. నామపంజరం
28. శరణాగతి
29. మంత్రగాయత్రీ
30. మూలమంత్రం
31. క్షమాప్రార్థన
32. శాంతి- అర్పణం

ఇత్యాదులవలన ఉపాసకుడు మంత్రమయ దేహమనోబుద్ధులుగలవాడై తాను మంత్రమయుడు కావలెను. ఈ అంగముల పరిపూర్తి ననుసరించియే మంత్రసిద్ధి లభించును.

ఈ విధములైన విధినిషేధ జ్ఞానముగలవారై, సక్రమమైన అనుష్ఠానములున్నచో మంత్రము తప్పక సిద్ధించును. ఫలించును. మంత్రసిద్ధిచే ప్రకృతి-జీవ-ఈశ్వరులు వెంటనే అనుగ్రహించి తీరుదురు. ఏ మంత్రము సందేహములేదు. ముమ్మాటికిని సత్యము.

పూర్ణ విధి నిషేధముల పాటించకుండుటకును సత్క్రమ విధాన మవలంబించకుండుటకును మంత్రములయందు విశ్వాసము లేకపోవుటకును అజ్ఞానకృతదోషమే కారణము.

## మంత్రముల సంఖ్య.

భగవత్కటాక్షమునకు కారణ భూతములై భగవంతునియొక్క స్వరూప, రూప, గుణ, విభవ, ఐశ్వర్య, చేష్ట, శక్తులను ప్రకటితము జేయునట్టి బీజాక్షరములతో గూడుకున్నట్టి మంత్రములు భగవన్మంత్రము లనబడును.

ఇట్టి భగవన్మంత్రము లనబడునవి ఎన్ని? అసంఖ్యేయములు, అనూహ్యాములు. ఏల? భగవంతుని స్వరూప, రూప, గుణ, విభవ, ఐశ్వర్య, చేష్ట, శక్తులకు పరిమితిసంఖ్య యున్ననేగదా తత్ప్రతిపాదకములైన మంత్రములకు పరిమితియు, సంఖ్యయు నుండును. గాన భగవంతుని గుణములు, శక్తులు చేష్టలు అవతారముల వలెనే తత్ప్రతిపాదకములైన భగవన్మంత్రములును అసంఖ్యేయములు.

శ్రు॥ "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ॥" (తైత్తిరీయే)

భగవంతుని గురించి వేదపురుషుడే వాక్కుతో చెప్పజాలక పోయెను. మనస్సుతో ఊహించజాలకపోయెను. అందుచే వేదవాక్కులు మనస్సుతో సహా ఆభగవద్వర్ణనమునుండి విరమించుకొనవలసి వచ్చెను. గనుకనే శ్రీరంగ రాజస్తవములో

శ్లో॥ ఆస్తాం తే గుణరాశివత్ గుణపరీవాహాత్మనాం జన్మనాం సంఖ్యా.

"ఓ శ్రీరంగనాయకా! నీయొక్క కల్యాణగుణములు అనంతములైనవి. అటులనే ఆకల్యాణ గుణములను ప్రకాశింప జేయునట్టి నీయవతార విశేషముల సంఖ్యకూడ అనంతమైనవి" అని భట్టరువారు వర్ణించిరి.

శ్రీరామాయణము అయోధ్యకాండలో 2 స. 25 శ్లోకమున —

శ్లో॥ బహవో నృప! కల్యాణ గుణాః పుత్రస్య సంతి తే॥

"ఓ దశరథమహారాజా! నీకుమారుడైన శ్రీరామునికి అసంఖ్యేయములైన కల్యాణగుణములు గలవు" అని ప్రజలు వర్ణించిరి.

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున!॥

అని స్వయముగ భగవంతుడే భగవద్గీతయందు తన యవతారములు అసంఖ్యేయములని తెలిపియున్నాడు.

భగవన్నిర్హేతుక కటాక్షముచే పరావరతత్వ యాథాత్మ్యమును కరతలామలకముగ తెలిసికొనిన భక్తిరూపాపన్న జ్ఞాన సంపన్నులగు శ్రీ నమ్మాళ్వారులుకూడ తిరువాయ్మొళి యందలి 3 ప. 3 తి. 3 పా. లో.

"ఎణ్ణిల్ తొల్ పుగర్ది వానవరీశనే"

"సర్వేశ్వరుడు అసంఖ్యేయములైన అనాదియగు కల్యాణగుణములు కలవాడు, నిత్యసూరులకు నిర్వాహకుడు" అని సాయించిరి.

వీరే తిరువిరుత్తమున మొదటిపాశురమున –

"ఎన్నినిన్ఱయోనియుమాయ్ పిఱన్దాయ్ ఇమైయోర్ తలైవా"

"నీవు నిత్యసూరి నిర్వాహకుడవు. మమ్ముల నుద్ధరించు నిమిత్తమై అసంఖ్యేయములైన ఎన్ని అవతారముల నెత్తితివోగదా!" అని తెలిపియున్నారు.

## మంత్రతారతమ్యము.

ఇట్టి అసంఖ్యేయములైన భగవన్మంత్రములు వా వా స్వరూప స్వభావముల ననుసరించి రెండు తరగతులుగ విభజింపబడినవి. (1) వ్యాపక మంత్రములు. (2) అవ్యాపక మంత్రములు.

భగవంతుడు సర్వవ్యాపకుడు. అందుచే ఆయన స్వరూప స్వభావములుకూడ సర్వవ్యాపకములే.

ఇట్టి భగవంతుని సర్వవ్యాపకమైన స్వరూప స్వభావములను ప్రతిపాదించు మంత్రములు వ్యాపక మంత్రము లనబడును. ఇవి యపరిమిత శక్తి సంపన్నములు.

భగవంతు డప్పుడప్పుడు ఏవోకొన్ని ప్రయోజనముల నుద్దేశించి ఆ యా ప్రయోజన నిర్వహణమునకు వలయు కల్యాణ గుణములతో మాత్రము అవతారము లెత్తుచుండును. తన గుణచేష్టితములు ప్రదర్శించుచుండును. తనశక్తిని ఆవిష్కరించుచుండును. ఇట్టి పరిమితమైన భగవత్స్వరూప స్వభావములను ప్రతిపాదించు మంత్రములు అవ్యాపక మంత్రము లనబడును. ఇవి పరిమిత శక్తివంతములు.

ఇట్టి పరిమిత శక్తిగల మంత్రములకంటె నపరిమితశక్తిగల మంత్రములు శ్రేష్ఠములుగదా!

రామ, కృష్ణ, నరసింహ, హయగ్రీవ, గోపాల ఇత్యాది మంత్రములన్నియు అవ్యాపక మంత్ర వర్గములోనివి.

## వ్యాపక మంత్రములు.

శ్రు. 'తస్య యజు రేవ శిరః'

అన్ని వేదములలో శిరోభూషణమైనది యజుర్వేదము. అందు తైత్తిరీయారణ్యకమను అరణ్యమున నారాయణానువాక మనెడు వృక్షమునకు పుష్పమువంటి మంత్రపుష్పమున పరిమళ భాగమగు నారాయణ గాయత్రి కలదు.

"నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి
తన్నో విష్ణుః ప్రచోదయాత్" అనునదియే ఆ గాయత్రి.

ఈ నారాయణ గాయత్రిలో మూడు మంత్రములు కూర్చబడియున్నవి. ఒకటి నారాయణాష్టాక్షరి. రెండవది వాసుదేవ ద్వాదశాక్షరి. మూడవది విష్ణుషడక్షరి. ఈ మూడు మంత్రములను వ్యాపకమంత్రము లనబడును.

నారాయణ మంత్రమునే అష్టాక్షరి యని, మూలమంత్రమని, తిరుమంత్రమని యందురు.

ఈ వ్యాపకమంత్రములలోకూడ తరతమభావములు గలవు. ఇందు షడక్షరి భగవంతునివ్యాప్తిని మాత్రము పూర్తిగా చెప్పుచున్నది. గాని వ్యాప్యములైన పదార్థములను, అంతర్యామిగానుండి వ్యాపించు రీతిని, వ్యాపించియుండుటకు ఫలమగు సర్వాధారత్వమును, భగవంతుని కల్యాణగుణములను చెప్పుటలేదు. మరియు నీ విష్ణు శబ్దమునకు దేవతాంతరపరముగ నర్థముచెప్పుట కవకాశ ముండుటచే నశిష్టు లీమంత్ర మును దేవతాంతరపరముగ నుపయోగించుకొనుచున్నారు.

ఇక ద్వాదశాక్షరి మంత్రము—వ్యాపించురీతియగు అంతర్యామిత్వమును తెలుపుచున్నను వ్యాపించ బడు పదార్థములను తెలుపుటలేదు. అందులకై అరబలముచే సిద్ధించు 'సర్వ' శబ్దమును చేర్చుకున్నను భగవంతుని గుణములను తెలుపు శబ్దమేది? ఈ లోపమును తీర్చుటకై 'భగవచ్ఛబ్దమును' కూడ చేర్చుకొన వలసియున్నది. ఇంతియగాక వ్యాప్తికి ఫలమగు భగవదాధారత్వమును చెప్పుటలేదు. మరియు నీ వాసు దేవశబ్దము కూడ నశిష్టులచే దేవతాంతరపరముగ నర్థము కల్పించి యుపయోగింపబడుచున్నది. కావున నారెండు మంత్రములును గొప్పవేయైనను అశిష్టపరిగ్రహము, అపూర్తియను దోషములు కలవి.

## అష్టాక్షరీ మంత్ర వైభవము

(1) ఇక అష్టాక్షరియన్ననో వీటివలెగాక వ్యాపింపబడు నుభయ విభూతులను, అంతర్యామిత్వ మనెడు వ్యాపించురీతిని, వ్యాప్తికి ఫలమైన సర్వజగదాధారత్వమును, ఉపాయోపేయత్వమును, వ్యాపకు డైన భగవంతునియొక్క స్వరూపమునుతెలుపు జ్ఞానానందామలత్వాదులను, స్వరూపము నెఱింగిన పిమ్మట నెఱుంగదగు జ్ఞాన శక్తివాత్సల్యస్వామిత్వాది కల్యాణ గుణములను కంఠరవముతో స్పష్టముగా చెప్పు చుండుటచేతను,

(2) విష్ణుగాయత్రిలో ప్రాధాన్యమును సూచించుచు ప్రథమమందు పఠింపబడుట చేతను,

(3) కేవలము శ్రియఃపతిపరముగనే తప్ప మరి యే దేవతాపరముగను యిది యెవ్వరిచేతను సమన్వయింపబడజాలనిది అగుటచేతను,

(4) వైదికములగు ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతావలంబు లందరిచేతను ఇది ముముక్షువుల కత్యావశ్యకమైన మంత్రరాజముగ నంగీకరింపబడి యనుష్ఠింపబడుట చేతను,

(5) నాలుగు వర్ణములకును, నాలుగు ఆశ్రమములకును, వయోభేదము, లింగభేదము లేకుండ ఉపదేశముపొందుట కవకాశముకలదగుటచేతను,

(6) ఈ మంత్రముచే దెలుపబడు శ్రియఃపతికంటె నీమంత్రమే ప్రభావవంతమైన దగుటచేతను

(7) 'నారాయణ' యని ఒకనికి పేరుగా పెట్టుకొని పిలచినగాని, పరిహసించుటకు వాడినగాని, ఊతపదముగ వాడినగాని, దీనిచే నొకని నవమానపరచుటకు వాడినగాని, ఏవిధముగ దీని ననుసంధించి నను సమస్తపాపములను నశింపజేయునని భాగవత విష్ణుపురాణాది ప్రబంధములయందు ప్రతిపాదింపబడుట చేతను,

(తిరుమొళి ౧.౧.౯)

(8) కులం దరుం శెల్వం తందిడుం, అడియార్ పడు తుయరాయన వెల్లాం।
నిలందరుం శెయ్యుం నీళ్విశుంబరుళుం అరుళొడు పెరునిల మళిక్కుం।
వలందరుం మత్తుం తందిడుం పెత్తతాయినుమాయి ఇనంశెయ్యుం।
నలందరుం శొల్లై నాన్ కండుకొండేన్ నారాయణా వెన్నుం నామం॥

"నారాయణాష్టాక్షరీ మంత్రము మంచి కులము నిచ్చును. సిరి సంపత్తుల నిచ్చును. భగవద్దాసుల సమస్త దుఃఖములను సమూలముగ నశింపజేయును. పరమాకాశరూపమైన పరమపదము నిచ్చును. పరమ దయతో భగవదంతరంగ కైంకర్య స్థానమును కృపజేయును. తమనే గాకుండగ తమయాశ్రితులనుకూడ రక్షింపజేయగల శక్తి నిచ్చును. మనకు తెలియని శ్రేయస్సుల నెన్నింటినో సమకూర్చును. కన్నతల్లియై స్వస్వరూప జ్ఞానావిర్భావమును కలిగించును. ఇట్టి ఆనందమును కటాక్షించు 'నారాయణ' అను నట్టి భగవన్నామాత్మకమగు మంత్రమును నేను తెలిసి కొంటిని" అని తిరుమంగైయాళ్వార్లు అనుసంధించినటుల ఈ నారాయణాష్టాక్షరీ మంత్రము సమస్తమును ప్రసాదించున దగుటచేతను,

అధర్వశిరోపనిషత్తు

శ్రు. ఓ మి త్యగ్రే వ్యాహరేత్ నమ ఇతి పశ్చాత్,
నారాయణాయే త్యుపరిష్టాత్ ఓ మి త్యేకాక్షరం
నమ ఇతిద్వే అక్షరే నారాయణాయేతి పంచాక్షరాణి
ఏతద్వై నారాయణస్యాఽష్టాక్షరం పదం.

మొదట ప్రణవమును, పిమ్మట "నమః" పదమును, అటుపిమ్మట "నారాయణాయ", అను పదమును పలుకవలెను.

ప్రణవము ఒక అక్షరము, నమః పదము రెండు అక్షరములు, నారాయణాయ పదము అయిదక్షరములు. ఇటుల మొత్తము యీ మంత్రము ఎనిమిది అక్షరములు గలది.

దీనికి సర్వవేదసారమును, సర్వవేద సంగ్రహమును, సర్వవేదాద్యంతోచ్చారితమును అయిన ప్రణవము అంగియై, శిరోభూతమై, సౌంతమై యుండుట చేతను,

(10) ఈ మంత్రమున ప్రణవమే ప్రధానమైన భాగము. ఇదియే మంత్రసారము. మిగత భాగములు దీనియొక్క వివరణరూపములై యున్నందున, ఇది ఇతర నిరపేక్షమైన సిద్ధమంత్రమై యుండుట చేతను,

(11) శ్లో॥ ఐహలౌకిక మైశ్వర్యం స్వర్గాద్యం పారలౌకికం
కైవల్యం భగవంతం చ మంత్రోఽయం సాధయిష్యతి.

"పశువులు–పుత్రులు, పాడి–పంట, ధనము–ధాన్యము, భార్య–బిడ్డలు, ఆయువు–ఆరోగ్యము, సిరి–సంపత్తు ఇత్యాది ఐహికమైగాని పారలౌకికమైగాని యుండునట్టి సమస్తైశ్వర్యములను, ఆత్మప్రాప్తి రూపమైన కైవల్యమును, పరమపురుషార్థమైన భగవల్లాభమును కావలెనని కోరినవారికి జప హోమాదుల ద్వారా తాను స్వయముగ సాధనమై నిలచి ఆ యా పురుషార్థములను సమకూర్చునట్టి దగుటచేతను,

(12) కర్మిష్ఠులు తనను జప హోమాదులద్వారా సహాయముగా దీసికొన్నచో ఆ యా కర్మలకు విరుద్ధములగు పాపముల నన్నింటిని నశింపజేసి వాటిని నిర్విఘ్నముగ సులభముగ నిర్వహింపజేసి వాటి వాటి ఫలితములను సమకూర్చునట్టి దగుట చేతను,

(13) జ్ఞాన యోగావలంబులు తనను సహాయముగ దీసుకున్నచో జ్ఞానసిద్ధి కాటంక భూతము లగు పాపములను నివర్తింపజేసి తత్ఫలమును, సమగ్రముగ సమకూర్చునట్టి దగుట చేతను,

(14) భక్తియోగ నిష్ఠులు తనను సహాయముగ గొనినచో భక్తియోగము ఫలించుటకు విఘ్న కరములైన పాపముల నన్నింటిని నశింపజేసి ఆ భక్తిని వృద్ధిపరచి తత్ఫలమును సుష్ఠుగ సమకూర్చు నట్టి దగుట చేతను,

(15) సుశకము స్వరూపాను రూపము అగునట్టి ప్రపత్తియోగనిష్ఠులు తనను స్వీకరించినచో వారలకు స్వస్వరూప జ్ఞానమును అతి విశదముగ కలిగించి అర్థానుసంధానముద్వారా కాలక్షేపమునకు హేతువై,

పాశు. "ఎనక్కెన్ఱుం తేనుం పాలుం అముదమాయ
తిరుమాల్ తిరునామమ్ (తిరుమొழி. ౬-౧౦-౭)

"ఆ శ్రియఃపతియొక్క అష్టాక్షరరూప తిరునామమే నా కెప్పటికిని తేనె, పాలు, అమృతమువలె భోగ్యము" అని తిరుమంగై యాళ్వార్లు సాయించినటుల స్వయంభోగ్యమై కాలక్షేపకారణమై యుండున దగుటచేతను,

(16) హారీతస్మృతియందు చెప్పబడినటుల – సమస్తవేదములు, ఇతిహాసములు, పురాణములు, వేద వేదాంత పారంగతులైన మహాత్ములు, మునులున్ను సారాంశముగ తెలుపునట్టి అర్థపంచక మనబడు,

(1) పొందబడునట్టి పరమాత్మను గూర్చి జ్ఞానము.
(2) పొందునట్టి జీవునిగురించిన జ్ఞానము.
(3) పరమాత్మను పొందుటకు సాధనమును గూర్చిన జ్ఞానము.
(4) తత్ప్రాప్తికి ఫలమునుగూర్చిన జ్ఞానము.
(5) అందులకు విరోధులైన వాటినగూర్చిన జ్ఞానము.

అను నీయైదు జ్ఞానములను విశదముగను సులభముగను తెలుపున దగుట చేతను,

(17) ఇది తనను అనుసంధించు వారలకు ఆ జన్మమునందే భగవత్ప్రాప్త్యాసత్తి రూపజన్మాంతరమును కలిగించున దగుట చేతను,

(18) శ్లో॥ యత్రాష్టాక్షరసంసిద్ధో, మహాభాగో మహీయతే
న తత్ర సంచరిష్యంతి వ్యాధిదుర్భిక్షతస్కరాః ॥

"అష్టాక్షరీ మంత్రముయొక్క సిద్ధిమాత్రముచే వ్యాధులుగాని, ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక బాధలుగాని, కరువులుగాని, అతివృష్టి అనావృష్టులుగాని ఏమియు నుండజాలవు" అని తెలుపబడి యుండుటచేతను.

(19) మహాసిద్ధ మంత్రమగుటచే సిద్ధారి చక్రాదులుగాని, అర్వణాదులుగాని చూడనవసరము లేకుండగ నందరకు నాధికారికమై యుండుట యను మాహాత్మ్యము కలిగిన మంత్రరాజ మగుటచేతను,

(20) మహామంత్రమునకు ముఖ్యలక్షణమైన శబ్దశక్తి, అరశక్తి, విశేషశక్తి యను మూడు శక్తులను సంపూర్ణముగా కలిగియుండిన దగుటచేతను,

(21) ప్రాకృతిక బంధముల నన్నింటిని పూర్తిగ వశింపజేసి పునరావృత్తి రహితమైనట్టి నిత్య నిరతిశయ నిరవచ్ఛిన్న ఆనంద రూపమైనట్టి భగవద్భాగవత కైంకర్యరూప శుద్ధమోక్షమును ప్రసాదించు నట్టి మంత్రమగుట చేతను,

(22) మంత్రమగుటచే సాధనరూపమైనదగుట, స్మరింపబడు పరమాత్మ అత్యంత ప్రియతము దగుటచే తానును అత్యంతప్రియతమమై సాధ్యరూపమగుట, సహజముగనే భోగ్యమైనదగుట మొదలగు వైలక్షణ్యములచేతను,

(23) మంత్రము లన్నిటికంటెను ఈ యష్టాక్షరీ మంత్రమొక్కటియే సర్వశ్రేష్ఠమైనదై దీనికి మించిన ప్రభావము కలదిగాని, దీనికి మించిన శక్తివంతమైనదిగాని, దీనికి మించిన వైభవము కలదిగాని, ఉత్తారకమైనదిగాని వేరొకటిలేదు.

(24) ఇంత గొప్పది కనుకనే ఇది వేదములు, ఋషులు, ఆళ్వారులు, ఆచార్యులుమొదలగు వారిచే మిక్కిలి యాదరింప బడుచున్నది.

కావున నీ యష్టాక్షరీ మంత్రమే —
అందరకును ఉపదేశార్హమైనది. అందరకును ఆదరించతగినది.
అన్నియాపత్తులను పోగొట్టునది. విశ్వకల్యాణమును సమకూర్చునది.

## వేదములోని కొన్ని ప్రమాణములు

1. నారాయణానువాకమున:

"నారాయణాయ విద్మహే"

నారాయణుని ఉపాసించుచున్నాము

2. తైత్తిరీయమున నారా. ౧౧.

విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం ప్రభుం ।
విశ్వతః పరమం నిత్యం విశ్వం నారాయణం హరిం ।
విశ్వ మేవేదం పురుష స్తద్విశ్వ ముపజీవతి ।
పతిం విశ్వస్యాఽఽత్మేశ్వరం శాశ్వతం శివ మచ్యుతం ।
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం ।
నారాయణపరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః ।
నారాయణపరోజ్యోతి రాత్మా నారాయణః పరః ।
యచ్చ కిఞ్చి జ్జగ త్యస్మిన్ దృశ్యతే శ్రూయతేఽపి వా ।
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః ॥

ప్రపంచమంతయు క్రీడాపరుడును, నాశరహితుడును, సర్వోత్కృష్టుడును సర్వజగత్కారణుడును నగు నారాయణాత్మకమే. ఈ నారాయణుడు లోకాతీతుడును, నిత్యమైనవాడును. ఆశ్రితులపాపమును హరించువాడును, జగచ్ఛరీరుడును అగుచున్నాడు. ఆతనివలననే చేతనాచేతనాత్మకమగు లోకమంతయు నుజీవించుచున్నది. ఆతడు జగత్తున కంతకు స్వామి. చేతనులకు నియన్త. సతతైకస్వరూపుడు, మంగళకరుడు, నిర్వికారుడు, పరమప్రాప్యుడు, జగచ్ఛరీరుడు నగు నీ నారాయణుడు ప్రాజ్ఞులకు మాత్రమే నెరుంగదగినవాడు. ఈతడే పరంబ్రహ్మ, ఈతడే పరతత్వము. ఈతడే పరంజ్యోతిస్వరూపుడగు అంతరాత్మ. ఈ లోకమందు కాన్పించునట్టియు సర్వవస్తువులకును లోపల బయట అంతటను వ్యాపించి నారాయణుడుండును.

3. మహోపనిషత్తున ౧. ౧. ౧.

"ఏకో హవై నారాయణ ఆసీత్ న బ్రహ్మ
నేశానో నేమే ద్యావా పృథివీ న నక్షత్రాణి ।
నాఽఽపో నాఽగ్ని ర్న సోమో న సూర్యః ॥

సృష్టికి పూర్వావసయందు బ్రహ్మ, రుద్రుడు, భూమి, ఆకాశము, నక్షత్రములు, నీరు, నిప్పు, చంద్రసూర్యులు వీరెవ్వరును లేరు. నారాయణుడొక్కడు మాత్రమే యుండెను.

4. సుబాలోపనిషత్తున ౬.

నైవేహ కిఞ్చ నాఽగ్ర ఆసీదమూలం
అనాధారా ఇమాః ప్రజాః ప్రజాయంతే.
దివ్యో దేవ ఏకో నారాయణః
చక్షుశ్చ ద్రష్టవ్యఞ్చ నారాయణః
శ్రోత్రం చ శ్రోతవ్యఞ్చ నారాయణః

ఘ్రాణశ్చ ఘ్రాతవ్యం చ నారాయణః
జిహ్వా చ రసయితవ్యం చ నారాయణః
త్వక్చ స్పర్శయితవ్యం చ నారాయణః
మనశ్చ మంతవ్యం చ నారాయణః
బుద్ధిశ్చ బోద్ధవ్యం చ నారాయణః
అహఙ్కారశ్చాహఙ్కర్తవ్యం చ నారాయణః
చిత్తం చ చేతయితవ్యం చ నారాయణః
వాక్చ వక్తవ్యం చ నారాయణః
హస్తౌ చ దాతవ్యం చ నారాయణః
పాదౌ చ గంతవ్యం చ నారాయణః
పాయుశ్చ విసర్జయితవ్యం చ నారాయణః
ఉపస శ్చాఽఽనన్దయితవ్యం చ నారాయణః ॥

ఈ ప్రపంచమున ప్రత్యక్షగోచరమైన దేదియును పుట్టుటకు పూర్వము కారణము లేకయో పుట్టినది కాదు. ఈ కావ్పించుచున్న ప్రజలందరును ఆధారమైన శ్రియఃపతి లేకయే పుట్టుటలేదు. వైకుంఠవాసుడును ఉభయవిభూతులను తనకు లీలాపరికములుగా గలవాడును అగు నారాయణుడొక్కడున్నాడు. చూచునట్టికన్నుచూడబడు విషయమునారాయణాత్మకమె. వినునట్టి చెవి వినబడు విషయము, వాసనచూచు ముక్కు వాసనచూడబడు విషయము, రుచిచూచు నాలుక రుచిచూపబడు విషయము, తాకునట్టి త్వగింద్రియము తాకబడు విషయము మననముజేయు నాత్మ మననము చేయబడు విషయము, తెలుసుకొను బుద్ధి తెలియబడు విషయము, సర్వము నేననదగినవాడు, అట్లు నేననబడు సర్వమును, చిత్తము, చిత్తముచే నెరుంగదగిన విషయము, వాగింద్రియము, దానిచే చెప్పదగిన విషయము, చేతులు, వాటిచే నొసంగబడు విషయము, పాదములుపాదములచే పొందదగిన విషయము, మొదలగునవి సమస్తమును నారాయణాత్మకములే.

మహాకాలాశ్చ కల్పాశ్చ మహాకల్పాశ్చ
ఊర్ధ్వంచ దిశశ్చ సర్వం నారాయణః
పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చ భవ్యం
తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః

మహాకాలము, కల్పములు, మహాకల్పములు, ఊర్ధ్వము, దిక్కులు, అన్నియుకూడ నారాయణుడే. ఇట్టి భూతభవిష్యద్వర్తమానము లగువాటి నన్నింటిని నారాయణునిగ తెలిసుకొనవలెను. ఇట్టి నారాయణుని పరమపదమును, నిత్యసూరు లెల్లప్పుడును సేవించుచుందురు.

5. అంతర్యామి బ్రాహ్మణమున:
య స్యాత్మా శరీరం యస్య పృథివీ శరీరం

ఏష సర్వభూతాన్తరాత్మా ఉపహతపాప్మా
దివ్యో దేవ ఏకో నారాయణః ॥

ఎవనికి చేతనజాతమున్ను, పృథివ్యాది అచేతన జాతమున్ను శరీరమువలె ఆధేయము విధేయము శేషభూతము అయినదో, అట్టి సకల ప్రాణులకు నంతరాత్మయై పాపములకు శత్రువైన వైకుంఠధాముడై నిరాజిలువాడు అద్వితీయుడగు శ్రీమన్నారాయణుడే.

6. అథర్వశిరసి-నారాయణోపనిషత్తు:
ఓ మిత్య గ్రేవ్యాహరేత్ నమ ఇతి పశ్చాత్
నారాయణాయే త్యుపరిష్టాత్ ॥

మునుముందు "ఓమ్" అనవలెను. పిమ్మట "నమః" యనవలెను. ఆపైన "నారాయణాయ" యని ఉచ్చరించవలెను.

ఓమిత్యే కాక్షరం, నమ ఇతి ద్వే అక్షరే, నారాయణాయేతి
పఞ్చాక్షరాణి, ఏతద్వై నారాయణ స్యాఽష్టాక్షరం పదం

ఓమ్ అనునది ఒక అక్షరము. "నమః" అను నది రెండక్షరములు. నారాయణాయ అనునది ఐదక్షరములు. ఇదియే నారాయణాష్టాక్షరీ మహామంత్రము.

యో హ వై నారాయణ స్యాష్టాక్షరం పదమధ్యేతి ।
అనపబ్రువ స్సర్వ మాయురేతి. విన్దతే
ప్రాజాపత్యం రాయస్పోషం గౌపత్యం ।
తతోఽమృతత్వ మశ్నుతే. తతోఽ మృతత్వ
మశ్నుత ఇతి, యఏవం వేద, ఇత్యుపనిషత్ ॥

ఎవ్వడీనారాయణాష్టాక్షరీ మంత్రమును గురుముఖతః ఉపదేశమును బడయుచున్నాడో వాడు నిరాటంకముగ పురుషాయుషము జీవించుచున్నాడు. సత్సంతానమును, నిరపాయమగు ధనరాసులను బడసి గోస్వామియై ఐహిక సుఖముల నన్నిటిని యనుభవించి చివరకు అతడు పరమపదమును బడయును.

ఈ రహస్యము నెఱింగినవాడును పై ఫలములనందగల్గును. ఇంతతో నీయుపనిషత్తుముగిసినది.

ఓం నమో నారాయణాయేతి
మంత్రోపాసకః వైకుంఠభవనం గమిష్యతి ।

నారాయణాష్టాక్షరీ మంత్రమును ఉపాసించువాడు శ్రీ వైకుంఠమును పొందగలడు.

## స్మృతులలో కొన్ని ప్రమాణములు

శ్లో॥ భూత్వోర్ధ్వబాహు రద్యాత్ర సత్యపూర్వం బ్రవీమి వః,
హే పుత్రశిష్యా శ్శృణుత న మంత్రోఽష్టాక్షరా త్పరః ॥

వ్యాసమహర్షి పుత్రతుల్యులగు ఓ శిష్యులారా! చేతులెత్తి ప్రమాణమును జేసి మీకు జెప్పుచున్నాను వినుడు. అష్టాక్షరీ మంత్రముకంటె మరి గొప్పదిలేదు.

శ్లో॥ సర్వవేదాంత సారార్థః సంసారార్ణవతారకః,
గతి రష్టాక్షరో నృణాం అపునర్భవకాంక్షిణాం ॥

సమస్త ఉపనిషత్తులయొక్క సారార్థమైనదియు, సంసారసముద్రము నుండి ఉద్ధరింపజేయునదియు అష్టాక్షరీమంత్రమే. జన్మరాహిత్యమును గోరువారలకు యింతకంటెను వేరుగతి లేదు.

ఆర్తా విషణ్ణాశ్శిథిలా శ్చ భీతాః ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః,
సంకీర్త్య నారాయణశబ్దమాత్రం విముక్తదుఃఖా స్సుఖినో భవంతి ॥

ఆర్తులేగాని, దుఃఖితులేగాని, శిథిలితమనస్కులేగాని, భయగ్రస్తులేగాని, ఘోరమైన వ్యాధులచే బాధపడువారలేగాని "నారాయణ" అను కేవల శబ్దమాత్రమునే కీర్తించినచో అన్నిదుఃఖముల నుండియు విముక్తులగుదురు. సౌఖ్యముగా నుందురు.

నారాయ ణేతి శబ్దోఽస్తి వాగస్తి వశవర్తినీ,
తథాపి నరకే ఘోరే పతంతీతి కిమద్భుతం ॥

సర్వసులభమైన "నారాయణ" అను శబ్దముగలదు. అశబ్దము నుచ్చరించుటకు నాలుక మన వశములో గలదు. అయినప్పటికిని ఘోరమైన నరకమునందు పడుచున్నారే - ఇదేమి ఆశ్చర్యము?

కిం తత్ర బహుభి ర్మంత్రైః కిం తత్ర బహుభి ర్వ్రతైః
నమో నారాయణా యేతి మంత్ర స్సర్వార్థసాధకః ॥

బాగుపడ దలచినవానికి అనేకమైన మంత్రములతో నేమి ప్రయోజనము? అనేక వ్రతములతో నేమి ప్రయోజనము? అష్టాక్షరీ మంత్రమే సమస్త ప్రయోజనములను సాధించగలదు.

ఐహలౌకిక మైశ్వర్యం స్వర్గాద్యం పారలౌకికం,
కైవల్యం భగవంతం చ మంత్రో ఽయం సాధయిష్యతి ॥

ఈ అష్టాక్షరీమంత్రము ఇహలోక సంబంధమైన పశు - పుత్ర - అన్న - మిత్ర - కళత్ర - ధన - ధాన్య ఆయు - రారోగ్య భాగ్య - భోగ్యములను, స్వర్గ - సత్యాదిలోకములను, కైవల్యమును, శాశ్వతమైన పరమపద నాథుని సాయుజ్యమును ఏది కోరిన దాని నెల్లనిచ్చును.

నారాయణం జపే న్నిత్యం ప్రణమ్య పురుషోత్తమం,
స్వపన్ నారాయణం విప్రః తిష్ఠన్ జాగ్రత్ సనాతనం ॥

పురుషోత్తముడగు నారాయణుని నమస్కరించి ప్రతినిత్యము జపింపవలయును. నిద్రలో, స్వప్నమును గనుచున్నను. నిలుచునియున్నను, మేలుకొనియున్నను సనాతనుడగు నారాయణుని స్మరించుచుండవలయును. అట్టివాడే విప్రుడనబడును.

ఉన్మిష న్నిమిష న్వాపి నమో నారాయణేతి వై,
భోజ్యం పేయం చ లేహ్యం చ నమో నారాయణేతి యః ॥
అభిమంత్ర్య స్పృశన్ భుంక్తే స యాతి పరమాం గతిం ॥

మేలుకొనియున్నను, నిద్రబోవు చున్ననుకూడ "నమో నారాయణ" అని అనుచుండవలయును. తినునట్టి వస్తువులనేగాని, త్రాగునట్టి వస్తువులనేగాని, నాకునట్టి వస్తువులనేగాని 'నమో నారాయణ' అని ఎవడైతే స్పృశించి అభిమంత్రించి భుజించునో, అటివాడు పరమపదమును పొందును.

త్రయో వేదా షడంగాని ఛందాంసి వివిధా స్స్వరాః,
సర్వ మష్టాక్షరాంతస్థం యచ్చాన్యదపి వాఙ్మయం ॥

మూడు వేదములును, ఆరు వేదాంగములును, ఛందస్సులును, అన్నివిధములైన స్వరములును, తదితర వాఙ్మయమును అన్నియు అష్టాక్షర మంత్రమున అంతర్గతమై యున్నవి.

అసీనో వా శయానో వా తిష్ఠన్వా యత్రకుత్రచిత్,
గతి రష్టాక్షరో నృణాం అపునర్భవకాంక్షిణాం ॥

తిరిగి జన్మించకుండవలయునను కోరికయేయున్నచో, ఆటివారలందరకును ఎందుకూర్చున్నను, ఎందు శయనించినను, ఎచ్చట నిలుచున్ననుకూడ అష్టాక్షరీ మంత్రమును స్మరించు చుండుటయేశరణ్యము.

బృహద్హారీతే :

యథా సర్వేషు దేవేషు నాస్తి నారాయణాత్పరః,
తథా సర్వేషు మంత్రేషు నాస్తి చాష్టాక్షరాత్పరః ॥

దేవతలందరిలోను నారాయణునికంటె అధికుడు ఎటుల లేడో, అటులనే మంత్రము లన్నింటిలోను అష్టాక్షరి మంత్రముకంటె గొప్పది లేదు.

వ్యక్తం హి భగవాన్ దేవః సాక్షా న్నారాయణ స్స్వయం
అష్టాక్షరస్వరూపేణ ముఖేషు పరివర్తతే ॥

నారాయణుడు మాత్రమే దేవుడు. ఆయనే భగవంతుడు—అను విషయము లోకప్రసిద్ధమైనదే కదా ! ఆయనే అష్టాక్షరిమంత్ర స్వరూపుడుగా అందరివాక్కులయందును వర్తించుచున్నాడు.

మంత్రాణాం పరమో మంత్రః గుహ్యానాం గుహ్య ముత్తమం,
పవిత్రం చ పవిత్రాణాం మూలమంత్ర స్సనాతనః ॥

అష్టాక్షరీమంత్రమే అన్ని మంత్రములకు మూలమైనది. ఇది సనాతనమైనది. మంత్రము లన్నింటిలోను ఉత్కృష్టమైనది. రహస్యము లన్నింటికంటెను ఉత్తమమైనది.

బహవో హి మహాత్మానో మునయ స్సనకాదయః,
అష్టాక్షరం సమాశ్రిత్య తే జగ్ము ర్వైష్ణవం పదమ్ ॥

అనేకమంది మహాత్ములును సనకాదిమునులును అష్టాక్షరీమంత్రమును ఉపాసించియే శ్రీవిష్ణు లోకమును జెందిరి.

(ముకుందమాల)

హే మర్త్యాః! పరమం హితం శృణుత వో వక్ష్యామి సంక్షేపతః
సంసారార్ణవ మాపదూర్మిబహుళం సమ్యక్ ప్రవిశ్య స్థితాః।
నానాజ్ఞాన మపాస్య చేతసి నమో నారాయణాయే త్యముం
మంత్రం సప్రణవం ప్రణామసహితం ప్రావర్తయధ్వం ముహుః ॥

ఓ మానవులారా! మీకు పరమహితమైన దానిని క్లుప్తముగ జెప్పుచున్నాను. శ్రద్ధతో వినుడు. మీరు అధికమైన ఆపదలను తరంగములు అధికముగకల సంసార సముద్రమున పూర్తిగ మునిగియున్నారు. వివిధములైన యితర అజ్ఞానములను పరిత్యజించి మనస్సున నమః ప్రణవములతోకూడుకొని యున్న ఈ నారాయణాష్టాక్షరీ మంత్రమును మాటిమాటికి స్మరించు చుండుడు.

(భారత అశ్వమేధపర్వము)

తస్మా దష్టాక్షరం మంత్రం మద్భక్తై ర్జీత కల్మషైః
సంధ్యాకాలే తు జప్తవ్యం సతతం చాత్మ శుద్ధయే ॥

కనుక నా భక్తులు ప్రతినిత్యము సంధ్యాకాలములయందు అష్టాక్షరీ మంత్రమును జపించుచుండ వలసినది. దీనివలన వారు తమ పాపముల నన్నింటిని పోగొట్టుకొందురు. తమను పరిశుద్ధులగ జేసి కొనగలరు.

అన్యేషా మపి విప్రాణాం కిల్బిషం హా ప్రణశ్యతి
ఉభే సంధ్యే ప్యుపాసీత తస్మా ద్విప్రో విశుద్ధయే ॥

ఏ విప్రుడైనను సరియే దీనిని రెండు సంధ్యా వేళలందు ఉపాసించవలెను. అట్టివారి పాప ములు పూర్తిగ నశించగలవు. దీనివలన అట్టి విప్రుడు పరిశుద్ధుడు కాగలడు,

ఏవం గురో స్సమారభ్య మంత్రానుష్ఠాన మాచరేత్ ।
అష్టాక్షరం జపే ద్విద్వాన్ నిత్య మష్టసహస్రకమ్ ॥

ఈ విధముగ ఈ యుపాసకుడైనవాడు గురువు వలన ఉపదేశమునుబొంది, వారిని ధ్యానించి ప్రతిదినమును ఈ అష్టాక్షరీ మంత్రమును ఎనిమిది వేల పర్యాయములు జపానుష్ఠానము చేయవలెను.

అజప్త్వాష్టాక్షరం మంత్రం నాహ మశ్నామి కించన ।
యావజ్జీవం జపామీతి పశ్చా దహరహర్జపేత్ ॥

అష్టాక్షరీ మంత్రమును నేను యావజ్జీవము జపింతును. దీనిని జపించకుండగ నేను దేనిని భుజించనని దీక్షవహించి, దీనిని ప్రతిదినము జపించవలయును.

అష్టాక్షరీజపో యస్య నిత్యనైమిత్తికోఽపి వా ।
కామ్యో వాపి భవే త్తస్య నిత్యా దేవార్చనా స్మృతా ॥

ఎవనికైతే ఈ అష్టాక్షరీ మంత్రజపము నిత్యకర్మముగ గాని, నైమిత్తిక కర్మముగ గాని, కామ్య కర్మముగగాని యుండునో వాని కదియే నిత్య దేవార్చన యనబడుచున్నది.

అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా ।
యః స్మరే త్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతర శ్శుచిః ॥

పవిత్రుడేగాని అపవిత్రుడేగాని ఏట్టి అవస్థనుపొంది యున్నవాడై నప్పటికిని ఎవడైతే పుండరి కాక్షుని స్మరించునో అట్టివాడు బాహ్యముగను ఆంతరంగికముగను కూడ పరిశుద్ధుడే యగుచున్నాడు.

దేవతాంతర నామాని న స్మరే దశుచి ర్జనః ।
నారాయణస్య నామాని సదా సర్వత్ర కీర యేత్ ॥

నారాయణునిమాత్రమే ఎపుడైనను స్మరించ వచ్చును. ఇతర దేవతలను అశుచిగా యుండి నపుడు స్మరించరాదు. ఏలనన నారాయణుకు తానే మనకు శుచిత్వమిచ్చును. ఇతర దేవతలన్ననో మన శుచిత్వముపై ఆధారపడియుందురు.

చక్రాయుధస్య నామాని సదా సర్వత్ర కీర్తయేత్ ।
నాశౌచం కీర్తనే తస్య పవిత్రం భగవాన్ హరిః ॥

నారాయణునియొక్క నామములను అన్నికాలములయందును, అన్నిదేశములయందును, కీర్తించ వచ్చును. నారాయణుని కీర్తించుటలో ఆశౌచమను అడ్డు లేనేలేదు. భగవంతుడగు శ్రీహరి సదా పవిత్రుడుగదా.

పరాశరీయే —

మౌనం వాచో నివృత్తి స్స్యాత్ నాత్రభాషా న సంస్కృతం।
నాన్యదేవేరణం విష్ణుం సదా ధ్యాయే చ్చ కీర్తయేత్ ॥

మౌనమనగా మాటలాడుకుండుట. కావున మౌనకాలమనందు దేశభాషలనుగాని సంస్కృతమును గాని మాటలాడరాదు. ఇతర దేవతల నుచ్చరించరాదు. విష్ణువును ఎప్పుడైనను సరియే కీర్తించవచ్చును.

1. (తిరువాయ్మొழி ౧. ౨. ౧౦)

"వణ్పుకழுనారణన్"

(అష్టాక్షరీమంత్ర ప్రతిపాద్యుడు) శ్లాఘనీయ సమస్తకల్యాణగుణాకరుడగు నారాయణుడు.

2. (తిరువాయ్మొழி ౧. ౧౦. ౮)

"శెల్వనారణన్"

(అష్టాక్షరీమంత్ర వాచ్యుడును) సంపత్పరుడును నగు నారాయణుడు.

3. (తిరువాయ్మొழி ౧౦. ౯. ౧)

"వాழிపుకழிనారణ౯"

(అష్టాక్షరీమంత్ర ప్రతిపాద్యుడు) ఆనందమయ అఖండ కల్యాణగుణార్ణవుడగు నారాయణుడు.

4. (తిరుప్పల్లాండు ౪)

"నాడు నకరముం నన్గరియ నమో నారాయణాయ"

పల్లెలు పట్టణములయందున్నవారు అష్టాక్షరిని గ్రహించునటుల అనుసంధించవలయును.

5. (తిరుప్పల్లాండు ౧౧)

"నల్వగైయాల్ నమో నారాయణాయ వెన్రునామం పల పరవి"

ఆచార్యముఖతః ఉపదేశమునుబడసి, అర్థానుసంధానముతో అష్టాక్షరీమంత్రమును అనుసంధించి ఎల్లప్పుడును భగవంతుని దివ్యనామములను పాడుచుండవలయును.

6. (తిరుప్పల్లాండు ౧౨)

నల్లాండెన్రు నవిన్రురెప్పార్ నమోనారాయణాయవెన్రు
పల్లాండు పరమాత్మనై శూழ்ందిరుం దేత్తువర్ పల్లాండే ॥

అష్టాక్షరీమంత్రమును అనుసంధించు కొనుటకు మంచి సమయమని ఎల్లప్పుడు అనుసంధించు వారు పరమాత్మయొక్క నిత్యసాన్నిధ్యమునుబొంది ఆయనను ఎల్లప్పుడు స్తుతింపగలరు.

7. (పెరియాళ్వార్ తిరుమొళ్ళి ౫. ౧౩)

"ఓవాతే నమో నారాయణావెనఞ"

ఎడతెగకుండగ నేను అష్టాక్షరిని జపించుచుందును గాక.

8. (పెరుమాళ్ తిరుమొళ్ళి ౨. ౪)

"నా త్తళుమ్బేళ్ల నారాణా"

నాలుక కాయకాచునటుల అష్టాక్షరిని జపించుచూ.

9. (పెరుమాళ్తిరుమొళ్ళి ౧౦. ౧౧)

"నలంతికళ్లినారణన్"

(అష్టాక్షరీ వాచ్యుడగు) నారాయణుడు నిరంతరము ప్రకాశించుచున్న ఆనందము కలవాడు.

10. (తిరుమాలై ౧)

"నాన్ముకనై నారాయణన్ పడైత్తాన్"

(అష్టాక్షరీమంత్ర ప్రతిపాద్యుడైన) శ్రీమన్నారాయణుడు చతుర్ముఖుని సృజించెను.

11. (తిరుచ్చంద విరుత్తం ౩. ౨. ౮)

"ఎట్టెళుత్తుమోతువార్గళ్ వల్లర్ వానమాళవే"

అష్టాక్షరీ మంత్రోపదేశమునుబొంది నిరంతరము అనుసంధించువారు తప్పక పరమపదమును ఏలుకొన సమర్థులు.

12. (పెరియతిరుమొళ్ళి ౧. ౧. ౧)

"నాన్కండుకొండేన్ నారాయణా వెన్నుం నామం"

నేను అష్టాక్షరీ మంత్రమును లభించుకొనగల అదృష్టవంతుడనైతిని.

13. (శిరియతిరుమడల్)

నారాయణా వోమణివణ్ణా! నాకణైయాయ్! వారాయ్!

ఓ నారాయణుడా! మాణిక్యవర్ణుడా! శేషశాయీ! వేంచేయుమా!

14. (౧ తిరువందాది ౫)

నమోనారాయణావెన్నుం శొన్మాలై కత్తినేన్ ।

“ నమో నారాయణాయ ” అనునట్టి మంత్రమాలను నేర్చుకొంటిని.

15. (౧ తిరువందాది ౯౫) 

నారణావెన్రోవాతురై క్కుం ఉరై యుండే ॥

నారాయణా ! యని నిరంతర మనుసంధించ దగినవార్త కలదుగదా !

16. (౨ తిరువందాది ౧)

ఞానచ్చుడర్విళక్కేత్తినేఁ నారణఱ్కు ।

నారాయణునికి జ్ఞానమనెడు దివ్యజ్యోతిని వెలిగించి సేవించితిని.

17. (౨ తిరువందాది ౨) 

నారణన్ట న్నామంగళ్ ।

నారాయణునియొక్క దివ్యనామములు.

18. (౨ తిరువందాది ౮౧) 

పగల్కండేన్ నారణనై క్కండేన్ ॥

అష్టాక్షరీ ప్రతిపాద్యుడైన నారాయణుని చూచినవాడే, నేను పగలు చూడగలిగితిని.

19. (౩ తిరువందాది ౮)

నామం పలశొల్ల నారాయణా ।

నారాయణ మంత్రమును పలుమార్లు స్మరించుదును.

ఈ విధముగ శ్రుతి, స్మృతి ఇతిహాస, పురాణ, ఆళ్వారాచార్య లందరిచేతను సర్వోపాదేయముగా నంగీకరింపబడి యుండుటచే నారాయణాష్టాక్షరీ మంత్రమే సర్వోత్తమ మంత్రముగా నంగీకరింపబడినది. తరించ నెంచువారి కీమంత్రమును మించినది వేరొకటి లేనేలేదు. ఇది ముమ్మాటికిని సత్యము.

పరమకారుణికుడైన పరమాత్మ ఇట్టి మహత్తర మంత్రరాజమును భూలోకమున ప్రవర్తింప జేయగోరినవాడై ధర్మ ప్రజాపతి మూర్తిదేవి అనువారలకు, హిందూదేశమునందలి ఉత్తరప్రాంత మందున్న హిమవత్పర్వతమునందున్న బదరికాశ్రమమున శిష్యాచార్య రూపమున నరనారాయణుడై యవత రించి ఈ మంత్రమును ఈ భూలోకమున ప్రకాశింపజేసెను.

శ్రియఃపతి లోకములో శిష్యాచార్యానుష్ఠానములను తెలుపుటకై తానే నారాయణ ఋషిరూపమున గురువుగను, తానే నరునిరూపమున శిష్యుడుగను అవతరించి ఈ మంత్రమును ఉపదేశరూపమున వెల్లడి పరచెను. పురశ్చరణ సిద్ధులకై ఈ చేతనులు ప్రయత్నించి ప్రయాసపడ నవసరము లేకుండగ ఆయనయే ఈ నాటివరకు స్థావరరూపమున నుండి నారాయణాష్టాక్షరిని జపించుచు నున్నాడు. ఇట్టి అనాది సిద్ధమైన పరమ పవిత్రమైనది అష్టాక్షరీ మంత్రరాజము.

కల్ప కల్పాంతరముల నుండియు పర్వతరూపముతో మనకై నారాయణాష్టాక్షరిని - తన్మంత్రాధిష్ఠాన భూతుడును, మంత్రవాచ్యుడును, మంత్రాచార్యుడును, మంత్రార్థానుష్ఠాతయునగు నారాయణుడే స్వయముగ జపించుచు తచ్ఛక్తిని మనకు ప్రసాదించుచుండుటచే ఈమంత్రమును విధ్యుక్తముగ గురూపదేశమును పొందిన ప్రపన్నులు దీని సిద్ధిని స్వయముగ పొందగలరు. ఆ భగవచ్ఛక్తియే యీ ప్రపన్నులకు పిత్రార్జితమై సంక్రమించుచున్నది. గనుకనే ఈ మంత్రమును యోగ్యులగు గురువులవద్ద ఒకే పర్యాయము ఉపదేశమును పొందిన చాలునని పెద్దలు శాసించిరి.

ఫలాభిసంధి రహితముగ కాలక్షేపము నిమిత్తమున్ను రసాస్వాదన తృప్తి శాంతి నిమిత్తమున్ను స్వరూప సిద్ధికొరకున్ను కృతజ్ఞతా సూచకముగను మాత్రమే ఈ మంత్రమును సర్వదా ప్రపన్నులు అనుసంధించు కొనుచుందురు. అనుష్ఠించుచుందురు. అంతమాత్రమే.

---

శ్రీమన్నారాయణ సంహితాయాం

# శ్రీమదష్టాక్షర విధాన జపవైభవకాండే

## ద్వితీయాధ్యాయ ప్రారంభః

బ్రహ్మ ఉవాచ:

దేవదేవ దయాసింధో వాంఛితార్థఫలప్రద।
తవాష్టాక్షరమంత్రస్య ఉద్ధారక్రమ మద్య మే॥ 1

బ్రూహి తస్య చ ఋష్యాదిన్యాసధ్యానాదికం చ యత్।
యస్య శ్రవణమాత్రేణ నరః స్యాద్వీతకల్మషః॥ 2

శ్రీ భగవానువాచ:

అథ వక్ష్యే శృణు బ్రహ్మన్ తవానుగ్రహకామ్యయా।
ఉద్ధారక్రమ మస్త్రాస్య మంత్రరాజస్య మే మనోః॥ 3

